శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ భావనారాయణ శతకము



ఉ॥ శ్రీయుత శంఖచక్రధర ♦ శ్రీధర మేఘశరీర సారవి
ద్యాయతి వీరనిర్జర కృ ♦ పాకరధీర ప్రకార క్రూర దై
తేయ వినాశకారవర ♦ తీర్థవిహార కిశోర భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧

ఉ॥ వ్రాయుదునిన్నుగూర్చి బహు ♦ వారములైననునేమి నీనుతిం
జేయుదుగాని యన్యనుతి ♦ జేయను నాభయమేమి నాకునీ
సాయమునెల్లవేళ ఫల ♦ సాయముగాదె సురేశ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణరక్షణేక్షణా ౨

ఉ॥ చేయుదునీకునంకితము ♦ జేర్చుచు నీశతకంబునందు నే
జేయుదు నీగుణంబుల వి ♦ శేషములే నుతులెందు ముందులో
బాయని ప్రేమదప్పులను ♦ బట్టక నేలుమయింక భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణరక్షణేక్షణా ౩

ఉ॥ ఆయువునందు నర్ధశత ♦ మాయె రమారమినాకు దాపము
ల్బాయ వఘంబులారయ న ♦ పారమసాధ్యపు సంసృతింగనం
గాయ మనోబలంబులధి ♦ కంబుగ లేవెట్లు బ్రోతొ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౪

ఉ॥ కాయము పుత్రమిత్రగృహ ♦ కామిని గోమహిషాదిచేతనా
దాయమదెల్ల కల్ల నిను ♦ దల్చునదెల్ల నిజంబయుల్లముం
బాయదదెల్ల సంతసము ♦ బర్వగ కొల్లగనల్ల భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణరక్షణేక్షణా ౫

ఉ॥ జాయమె రాజ్యలక్ష్మి తన ♦ సంతతి కాముడ జందుగంగయా
నాయె నఖండలుండతగు ♦ నన్నగ నారదుడయ్యె బౌత్రుడి
ట్లాయెను వంశవృద్ధి భవ ♦ దామిష మేమన నేను భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౬

ఉ॥ మాయను బాయగా నసుర ♦ మర్దను భక్తుడుగాక లాతికిం
బాయుట దుర్లభంబని కృ ♦ పామతి దేశికులుచ్చరింతురా
చాయ నిజంబ నెమ్మదిని ♦ నర్చనొనర్చిన నేను భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౭

ఉ॥ మాయకు రేయున్న యీజగతి ♦ మానవకోటి మనీష లెల్లచో
న్యాయము సున్నయైనగడు ♦ నాదరమొప్పగ క్షీరనీరస
న్యాయమె లర్పజీవుల దయా ♦ ర్ధము రక్షణజేతు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮

ఉ॥ శ్రేయమనంతపాదయుగ ♦ సేవనమబ్జజదేవరక్షకో
పాయమజాండ కీర్తికర ♦ భాసురమచ్యుత మస్మదీయసౌ
ఖ్యాయుతమద్భుతోక్తికర ♦ మైనది తావకపూజ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౯

ఉ॥ కాయిక వాగ్మనోదురిత ♦ కర్మలనేక మొనర్చినాడన
న్యాయపథుండనంబరగి ♦ నాడభవత్కృపజూపుమేలన
ల్పాయునరుండవైష్ణవుడ ♦ నాంధ్ర కవీశుడ నిత్యభావనా
రాయణభక్తపోషణమ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౦

ఉ॥ ఏయదిమోక్షసాధనసు ♦ క్షేప్సితమన్య మతాంబుదాళిజి
ద్వాయువనాది మానిజన ♦ వర్తనమాత్మ శరణ్య మిష్టభో
గాయుతమ స్మదాదినిర ♦ తార్థితమెంచగనీవభావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౧

ఉ|| నాయకనాయికీ విలస ♦ నాభినయప్రదకీర్తనాంశ భూ
నాయక నారదస్తుతధ ♦ నావృత తత్వత్రయార్థ పంచకా
ప్యాయితభక్తిభావన ప్ర ♦ పన్న జనాశ్రయ దేవభావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౨

ఉ|| లాయరుపత్రికం జదివి ♦ లా మదిగూడగ గోట్టుకెన్ని ప
ర్యాయములేగిచూచి సరి ♦ యైనవకీలును బెట్టుకొన్న దీ
ర్ఘాయువు గావలెన్నరులు ♦ వ్యాజ్యములాడుదమన్న భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౩

ఉ|| సంయమి సోమవైష్ణవయ ♦ శ్శ్రవత కామ్యపపన్న ధామస్వా
ధ్యాయవిలగ్న భాష్య రచి ♦ తాదిమక్షేమ మునీంద్ర సీమ శ్రీ
ప్రాయగురూత్తమామర నృ ♦ పాలమహీజమ్ము బోవు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౪

ఉ॥ శ్రీయతిరాజరాజ ముఖ ♦ శీతమయూఖ విరాజమానగం
గేయరహస్య మంత్రవ్రజ ♦ కీర్తనకల్పక భూజ బీజసం
ధాయక తేజ కంజసఖ ♦ ధర్మగురుప్రజపింజ భావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౫

ఉ॥ నీయుశ మెన్న నానురజ ♦ నీచరచందన కుంద క్షీరగం
గాయమి తారకాద్రి శర ♦ కల్ప కదర్పణకాశ చంద్రికా
వాయుభుగాధి పాబ్జసుర ♦ వారణ మాదిగ జూపిభావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౬

ఉ॥ డాయుదునేని భాగవతు ♦ డౌనను వానినతే స్తమొందగా
బోయెదనేని మీ కథల ♦ బొత్తెసలారగ బాడువానినే
బాయుదునేని యన్యమతి ♦ పద్ధతి జేరిన వానిభావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౭

ఉ॥ చేయుదునీకు జోతనిదె ♦ చేయుదు నీపదకంజ పూజనే
జేయుదు నీదుకీర్తన వి ♦ శేషముగా తవదాసదాస్యముం
జేయుదు నష్టభక్తుల స ♦ జీవుని గామన జేయ భావనా
నారాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౮

ఉ॥ కోయిల కుంభకోణమహీ ♦ గోత్ర మనంతశయాంబనాది పు
ణ్యాయతనంబులందెచట ♦ నైన మిముంగనుగొంచు ద్రావిడా
మ్నాయ మొగింబఠించి పర ♦ మార్థమిల న్నరుడొందు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౯

ఉ॥ కోయిల మావిలేజివురు ♦ గోరు బతివ్రత నైజనాధుతో
బాయక నుండగోరు నర ♦ పాలుడు రాజ్యమునందగోరు నే
నాయుశతంబుగోరుదు త ♦ వాంఘ్రుల నర్చనసేయ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౦

ఉ॥ ఆయపదార్థ నిష్టమన ♦ మార్గ్రబపన్నుడు సేయనోందు నా
రాయణుబట్టణంబని య ♦ థార్థముగా మునుజెప్పలేదె గాం
గేయుడు భారతీయులకు ♦ గేవలమేనటుజేతు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౧

ఉ॥ పేయ్య సముద్రమందునను ♦ పేంద్రుడనందగి శేషతల్పముః౦
బాయక రక్షణేచ్ఛనుర ♦ భాగమునందున మాసతీమణి
జాయనుదాల్చి లోకముల ♦ సారెకు బ్రోవుదువెన్న భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౨

ఉ॥ చాయమగందు రేవిలుగు ♦ జంటకనుల్వ్యసదారి సిజ్జమే
ల్దోయలిలచ్చి గుజ్జమల ♦ తోరపుబక్కిజగంబునందు ఫ
ర్మాయిషి బత్తులందలర ♦ మాటికి బ్రోవగనీకు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణరక్షణేక్షణా ౨౩

ఉ॥ వాయువు పైత్యముం గఫము ♦ వారణదోషములంద్రు వైద్యవి
ద్యాయుతులైన పండితులి ♦ హంబున దేహులకెల్ల రోగము
ల్బాయగ నంబుజాక్షుడల ♦ చీడలడంచెడి వెజ్జు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౪

ఉ॥ పాయవటుందిరంబెదవ ♦ పాయపు బాపము నిన్నుదల్చ గు
ఱ్ఱాయన కమ్మపాయిగుడు ♦ పందిననాకలిదీరునట్లు నా
ప్రాయమనంతశాయిహరి ♦ ప్రాపగునంటినిగావ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౫

ఉ॥ తోయధిశాయి ధర్మమును ♦ ద్రోల్తురు కొందరెఱింగి పెద్దల
న్దాయుచు గూయుచుంచురల ♦ ధర్మవిధిజ్ఞత నండకంబళు
ప్రాయుల ధర్మవర్తనుల ♦ పారమువాచకులౌట భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౬

ఉ॥ తోయధిదేవితోయమిల ♦ దోడగునాపథమంచు నెంచియా
తోయధిశాయి వైద్యుడని ♦ తోడనెపొల్చిరి సూరులట్లనే
జేయుదు వారివైద్యమది ♦ జెన్నగునీకృపబ్రోవ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణరక్షణేక్షణా ౨౭

ఉ॥ మాయదుసుమ్మకీర్తి మరి ♦ మాయదు సుమ్మపకీర్తి పూర్వమా
మ్నాయశ్రుతేతిహాసముఖ ♦ న్యాయముసుమ్మిల మూర్తిసిద్ధిగాం
గేయవచానువర్తితస ♦ ఖీప్సిత భద్రకరుండ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౨౮

ఉ॥ గేయ విధేయ విష్ణురథ ♦ కీకట శేషశయాన సర్వలో
కాయన చింతితార్థిధన ♦ న్యాయ విచారణ జాయమానస్వా
ధ్యాయకులాయ ప్రత్యయాయ ♦ ధార్ద్వయోదయకాయ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్ష రక్షణేక్షణా ౨౯

ఉ॥ కూయఁగరాని కూఁతలను ♦ గూయుటదప్పు తదీయకోటికిం
బాయుట, దప్పు దేవుడని ♦ పల్కుట నార్యుని మానవుండు నా
నాయెనుదప్పు భాగవత ♦ నైచ్య మెఱుంగమిదప్పు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౩౦

ఉ॥ కాయమనిత్యమంచు కన ♦ కంబు పులుశక్కియటంచు బూమి మే
ద్గోయలులెల్ల జోకనుచు ♦ తోయమువారలు దుద్దటంచు కం
జాయను నెంచి నే నినుని ♦ జంబనిదల్చెద బ్రోవు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౩౧

ఉ॥ చేయ బ్రపన్న కోట్లకిల ♦ జేతుల నెత్తి శిరంబువంచి మే
లాయెనటంచు దీవెనల ♦ లాగొనగూడగ దండమేసినే
జేయ దదీయ సంతతికి ♦ జెన్నగు నర్పనగావ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౩౨

ఉ॥ ఈయిల నాల్గు రూపముల ♦ నెంచు నుపాయములందు బంచమో
పాయ మెలర్చునంచును ప్ర ♦ పన్న విలక్షణ మూర్తులెందు లే
ప్రాయమునందు జెప్పిరి తి ♦ రంబని నమ్మితి నేను భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా 33

ఉ॥ కోయిల గట్టనేర ధన ♦ కోట్లను బాతుల బెట్టనేర వా
తాయన చిత్రితావసథ ♦ మగ్రజ శ్రేష్ఠున కివ్వనేరనా
ప్యాయమునొంద నీకు గవి ♦ తా శతకంబిదె దేలు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా 34

ఉ॥ వ్రాయగజాలనొంటి సు ♦ రాజకనిష్ఠుడ కావుమంటి మా
జాయగ నేలుకొంటి మది ♦ సారెకు నక్కరదీర్పుతోంటి స
ర్వాయువు నీకట టి తవ ♦ భక్తిని నుంటిని యొంటి భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా 35

ఉ॥ కోయన నిన్ను గూర్చి మన ♦ సోయన బద్ధదళాక్షు భక్తి తే
దోయన నిశ్చయంబుగన ♦ రోయన గాలగనెంచు నీకు జో
తోయన నెమ్మి నన్ను దయ ♦ తో గడు వేలవె నేల భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౩౬

ఉ॥ ఓయన నోర్కుమాటెదన ♦ మోయన రెండతూరి మాట నా
రాయణ యుగ్మనాడనొగి ♦ నాదల నెందు జతుర్థి నెంచిలో
నాయుపదార్థ నిష్ఠమున ♦ నాయెను నీకృప నేను భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౩౭

ఉ॥ తీయని తేనెలూరు తవ ♦ దివ్యపదాంబుజ తీర్థమాను శై
లేయము నేను భాగవతు ♦ లేగతియంచు పచించు నట్టి గాం
గేయుడ నేను లౌకికస ♦ ఖీ శ్రుతి ధర్మము మానలేని రా
ధేయుడగాను నిశ్చయ మి ♦ దేమది రాగగు బ్రోవు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౩౮

ఉ॥ మాయుని పేరమాయకుల ♦ మాయము జేసెడి ఱేడమాయిసూ
కాయమునిండ మాయమెద ♦ గన్పడకుండెదు మాయలాడనీ
మాయలమారి చేష్టలిక ♦ మాయవుగా నన్బ్రోవ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౩౯

ఉ॥ దాయమునివ్వ నీవ తెగు ♦ ధర్మమెద దగు దీవ లోకపా
దాయమునీవ దివ్యపర ♦ తత్వమునీవ జగంబునీవ యా
మ్నాయమునీవ జీవఘన ♦ న్యాయమునీవనిజంబ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౦

ఉ॥ కాయము వెలర్పనేలుకుల ♦ కాయక మొండెదిలేదు కాయికా
దాయము కాదు కాయమమ్మ ♦ తంబనగా [illegible] గాదు కాయిదా
నాయము పాదు నేనుసిరి ♦ నాయనిజూడగబోదు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౧

ఉ॥ దాతలనెన్న నాల్గురు య ◆ థార్థముగా దనువందు నన్ననే
దాయలనెన్న నిక్కమగు ◆ దాయకుడీవగు దాయుమన్నయా
దాయమెచెన్న జీవులకు ◆ దాయము నీవగుమిన్న భావనా
రాయణ భక్తపోషణ మ ◆ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౨

ఉ॥ మాయకుడీవటంటి తిరు ◆ మంత్రమువింటి ద్వయంబుగంటి న
న్యాయమడంచునట్టి చర ◆ మార్గ మెదంగనుగొంటి మంటినే
రేయిబవల్లు వానొగుల ◆ రెట్టిగ నిందలత్రోంటి భావనా
రాయణ భక్తపోషణ మ ◆ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౩

ఉ॥ తోయలికిన్నగంటు గడు ◆ దోడుగురుండటు శిష్యకోటికిం
బాయనితోడు రైతులకు ◆ బంటపొలమ్ముల దోడు దేవనా
కీమెడదోడు ముఖ్యముప ◆ నీశ్వర నీవుగదయ్య భావనా
రాయణ భక్తపోషణ ◆ మదాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౪

ఉ॥ వాయుసఖుండుకంటె సుర ♦ పాలునకంటె కుబేరుకంటె స
ద్వాయువుకంటె రాత్రిచర ♦ దైత్యునికంటె యముండుకంటె శ్రీ
తోయనిధీశుకంటె వర ♦ ధూర్జటికంటె ఘనుండ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౫

ఉ॥ డీయనుసొమ్ము నీయగరి ♦ డీయనుబ్లీడరు ఫీజుకన్న మో
డీయనలంచమన్న బురు ♦ డీయను హోటలటన్న మంచివా
డీయను గోర్టుఖర్చుధగి ♦ డీయనుమూర్ఖుడు నేల భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౬

ఉ॥ వాయిద మెల్లవేళ గుడి ♦ వాకిటమోరియగ గోదపేరుమే
ల్దోయలిగూడి మార్గళి మృ ♦ దూక్తుల ముప్పదిబాడిపొంగలిం
జేయగనారగించి నను ♦ జెన్నుగనేలుదు పాడి భావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౭

ఉ॥ తోయధికన్యకుం దమిన ♦ ధోక్షుపుదేవికి నంచయానకుం
దోయజగేహకుం దలిత ♦ తోయజనేత్రికి దోయజారిపూ
ర్ణాయమ బింబశోభిముఖకు ♦ బ్రజ్ఞనమస్కృతిజేతు భావనా
రాయణ భక్తపోషణ మ♦దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౮

ఉ॥ వాయుపురజ్జులేలనొక ♦ వాయునమిచ్చిన నోమువాయిదా
వాయునునిండి సాయమున ♦ వారిగబొందది నీకిడంగ వా
లాయము నెవ్వరేనియటు ♦ లైతగుదే నినుగూర్చి భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౪౯

ఉ॥ దోయిటనైన నీళ్లనొక ♦ దోసెడు నీకిడజాల బూజలం
జేయగజాల పాదసర ♦ సీరుహాయుగ్మమునందు బూలతో
బాయని కూర్మినేనిదిగో • బత్తినిమొక్కెద బ్రోవు భావనా
రాయణ భక్తపోషణ మ • దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౦

ఉ॥ తోయధిశాయికిం బుడమి ♦ తోయలికింగపిరంగశాయికిం
దోయద వేణికిం గలిమి ♦ తోయలికిందగు శేషశాయికిం
దోయద దానశీలికిని ♦ దోర్తి నమస్కృతి జేతు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౧

ఉ॥ ఈయకొలంది జెప్పెదిహి ♦ హీయనినవ్విన నేమిలాతులీ
వీయకొనంగ నించునకు ♦ నీచగనంబడదీపి మానన
ట్లీయదలంతు నీశతక ♦ మింపుగ నేగొనుమయ్య భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౨

ఉ॥ చేయజిరాయితిన్నిగుల ♦ జేయను బేరముసొమ్మునంద నే
జేయ నసాధ్యకృత్యముల ♦ జేటెద నెంచుచు గష్టమంచు వా
లాయము లాభముంగుతిచి ♦ లాలన జేయుచు బోవు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౩

ఉ॥ పూయుగనందు గొందు పెను ♦ పూతగ చందన మెల్ల వేళలో
దాయమటంచు బెండ్ల మిడ ♦ దాయిపసాదము వెట్టనట్ల స్వ
స్థాయిగ నారగింతు వెద ♦ జల్లన నెల్లరనేల భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౪

ఉ॥ ఊయెలఁబెట్టి తల్లిముద ♦ మొప్పగనూచెడి వేళ నిద్దురం
బోయెడి వేళ దృష్టిమయి ♦ బొల్పసలారెడి వేళ రక్షకై
తాయెతుగట్టి దూపమిడి ♦ తల్చెడి వేళల బ్రోతు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౫

ఉ॥ ఈ యిల విష్ణుచిత్తునకు ♦ నింపుగ గోదయనంగ బుట్టి వా
లాయమురంగ మందున క ♦ లాపసమాన ప్రసూనమాలిక
ల్పాయక నీకు నిచ్చితిరు ♦ పావువచించెను బ్రోవ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౬

ఉ॥ పోయెను నిండు జవ్వనము ♦ బోయెను దేహబలంబు మిక్కిలిం
బోయెను దంతసార మిల ♦ బోయెను ప్రౌఢతనంబు నెంతయేం
బోయెను బుద్ధిజ్ఞానమును ♦ బోయెను బ్రోవుమునన్ను భావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౭

ఉ॥ స్థాయుకుడొందు సత్యమతి ♦ దప్పకధర్మముజెప్పగొప్ప సం
ధాయకుడొందు వైరముల ♦ దాలిమి నొప్పగజెప్ప గొప్ప ధా
త్రేయికి నెంతయేని నిను ♦ రీతిగనంగడు గొప్ప భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౮

ఉ॥ వాయుజ పుండరీకశుక ♦ వ్యాసపరాశర సవ్యసాచి గాం
గేయవిభీషణార్జున స ♦ ఖీసతి నారద రుక్మవస్త్రదై
తేయజ శౌనకార్కజను ♦ ధీమణులాదిగ బ్రోతు భావనా
రాయణ భక్త పోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౫౯

ఉ. తోయజగంధి రాజ్యరమ ♦ తో గృపతోద్వర తోనుషంబుతో
దోయజనాభితో దులిత ♦ తోయజదృష్టులతో నిజంబుతో
దోయముతో గరంబలరు ♦ తోయముతో ననుబ్రోతు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా. ౬౦

ఉ. తీయనిపల్కు లిచ్చువగ ♦ దిన్నగజిల్కు మరుందు ముల్కువా
లాయము వేయ నల్కనెద ♦ లక్కన మొక్కడగుల్కు లచ్చిమే
ల్దోయలి తళ్కుమేననిను ♦ దొల్లిఘనంబుగగూడ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా. ౬౧

ఉ. నాయకిజూడ లక్ష్మి నర ♦ నాయకుడీవగు దక్షులందు నార
రాయణనాము లిర్వరజ ♦ రాజిలు నాభిని బుత్రుడొందు నా
రాయణ నాముఖుండు వల ♦ రారెడి నామమె నీకు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౬౨

ఉ. ఓయిఘనుండ నీకగున ♦ టోయి జగంబుల నేలజాలుదే
మోయి మదాత్మరక్షణ న ♦ మోయనసేయగ రాదటోయి నే
నోయితవాంఘ్రిసేవమతి ♦ నోయి కడుంగడు బ్రోవు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౩

ఉ. పాయసమెంతయేని గడు ♦ పారగ మెక్కెడువేళనైన నా
చాయ నొకింతగావ దయ ♦ జాలగనుంచవదేని భూమి నా
రాయణనామ సార్థకము ♦ నందుట దుర్లభమెన్న భావనా
రాయణ భక్తపోషణ మ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౪

ఉ. ఆయుశతంబునందు సగ ♦ మా నల నిద్దురనొంద బాల్యముం
బోయిన కొద్ది యౌవనము ♦ బొందుట కొద్ది కుమార దారలం
డాయుట కొద్ది వృద్ధతను ♦ డాయె నికెద్ది సుకంబు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౫

శుద్ధాంధ్రనిరోష్ఠ్యవృత్తము

ఉ॥ తాయిగదోయి నేలు సురు ♦ దాల్చిన యందరికెన్నరో యిసీ
తాయిగాదన్నడంచు దెద ♦ దల్చిన నేరికి హాయి నేలిక
న్నాయనగాదటోయి ససి ♦ నానన నీకగుదోయి భావనా
రాయణ భక్తపోణ ఘ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౬

ఉ॥ కాయము జీవుడచ్యుతుడు ♦ గ్రాలను తత్వములెన్న మూడు నీ
కాయము జీవుడెల్లచోట ♦ గాంచగ నచ్యుతుడేలనుండు లో
కాయక నందురట్లుదగు ♦ బద్ధదశాత్ముడవీవె భావనా
రాయణ భక్తపోషణ ఘ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౭

ఉ॥ హాయిగ నీపదార్చకుల ♦ నంస్తుల బూజలొనర్చజాలి నీ
చాయనుజూడజాలి సర ♦ సంబుగ నిన్నదదల్పజాలి నో
రేయడ నీదునామ నుతి ♦ నెంతయు జాలిన స్తోతు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౮

ఉ॥ పేయల నూటినిచ్చినను ♦ వేరగు ధర్మముసేయబూని గాం
గేయ వధూర్విధాన్యధన ♦ గేహములాదిగ నెన్నిటిచ్చినం
బాయునె బ్రహ్మహత్య తవ ♦ పాదయుగార్చనగాక భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౬౯

ఉ॥ జ్యాయుడ వంతరాత్మతను ♦ ప్రాయుడవార్తి వినాశకారణా
జ్ఞేయుడ వార్యరక్షణ వి ♦ నేయుడవన్య మతాంధకారశ్రీ
తోయజమిత్ర మాన్యుడవ ♦ ధోక్షజనాముడ వెన్న భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౦

ఉ॥ తాయమెసంగభక్తుడు హ ♦ ఠంబుగనిన్ను గుఱించి రాగమా
హాయనబాడి కీర్తనల ♦ హర్నిశలం జనువంగ ముక్తిసం
స్థాయముగాదె నీభజన ♦ మాత్మవినోదముదంబ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౧

ఉ॥ వేయివిధంబులం బెదన ♦ వీనప్రపత్తి తవాంఘ్రికంజపూ
జాయతినొంది ♦ మోక్షపథ ♦ సారముసందొగి దృష్టినొందితిఁ
జాయుపిడస్గ దర్గొలగు ♦ చాయనఘంబులు వోయెభావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౨

ఉ॥ ప్రాయిడియైతలంచిన కృ ♦ పారసవీక్షణ బ్రోతు వెల్లచో
బ్రాయిక మెల్లవేళనిది ♦ ప్రాయిగలాడవనేకరీతులం
బ్రాయమనంతమై వెలయు ♦ బ్రామిడిలేదెటులైన భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౩

ఉ॥ మాయలమారివైతిమెయి ♦ మాయిజెలంగితి మాయమొప్పమేల్
బేయలగాచితీవబువి ♦ వేయివితంబుల వేడ నిక్కటు
ల్మాయగజేసినావు పజ ♦ మాయురెనానను బ్రోవు భావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౪

ఉ॥ తోయధిధీగభీరపద ♦ తోయజసార సురారిమారకా
శేయవరాంబరాంగధర ♦ శ్రీధరమారకుమార పేస
త్తోయద భాశరీరముఖ ♦ తోయజవైరిప్రకార భావనా
నారాయణ భక్తపోషణ ♦ మదాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౫

ఉ॥ తోయరుహాక్ష ధర్మనయ ♦ దోహదనిత్యకృపాకటాక్షశ్రీ
నాయక దక్షరమ్యకమ ♦ లాలయవక్ష ప్రపన్న మోక్షగాం
గేయమునీశపక్షసుర ♦ గేహనివాసకటాక్ష భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౬

ఉ॥ సంయమనంబు జేకితిని ♦ చారపుసంసృతి నీవనేబళు
ప్రాయుడ సంభ్రమించచు ♦ ణాంబుజ పూజనొసంగజూడుగో
మాయువలెంచగాకు పరి ♦ మార్గమునాకిడుపట్ల భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౭

ఉ॥ తోయమునింగి గ్రిమ్మరులు ♦ దోయలిలచ్చియిల్లాలపాదు వేం
చేయుట బత్తులెక్కువగ ♦ జీరెడిచోటునకేల బూనవా
బాయక పెక్కుతీయనగు ♦ పాయసమల్పుడవౌనె భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౭౮

ఉ॥ రాయతికంబులోమిగుల ♦ రాయుడవై రమణాందిరంబు గై
రాయసకాండ్ర నేలదగు ♦ రాయసమొప్పదు రాలిపాటులే
కేయెడ నక్కసీల రహి ♦ నెంతయు ద్రుంచుదువెన్న భావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణరక్షణేక్షణా ౭౯

ఉ॥ తాయి జగంబునందు గడు ♦ దాయమనందగునట్లు దేశికుం
డాయెను జీవకోట్లకిల ♦ డాలుగదీరుగ బ్రోచుపట్ల నీ
వాయెను జీవనంబిడుట ♦ కన్యోడి పట్లనటొప్ప భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౦

ఉ॥ ఓ యనగావు మంటి నయ ♦ యోయనుకొంటి నోయూరివంటి మే
లోయియటంటి బత్తినెద ♦ లోగలదంటిని బొజ్జనిండగా
నోయిరమిమ్మటంటి గయి ♦ నొప్పగు నీకిడుటంటి భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౧

ఉ॥ మాయులు పాపముల్దొలగ ♦ మాటికి నొప్పగు శాంతి గుప్తచాం
ద్రాయణ మాది సద్వ్రతము ♦ లంచని దెల్పిరి వాటినెన్న సా
పాయముగాదె భాగవతి ♦ వారివెదందున జూడ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౨

ఉ॥ పేయసుడింభకుంబుడమి ♦ వేలుపుసంతిని గర్భిణీ సతిం
బాయక జంపుపాపముల ♦ పాపమనంజను సంతకన్న నా
రాయణు మానియన్య బరు ♦ డౌనను బాపము నెచ్చు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౩

ఉ॥ చేయను సాధనాంతరము ♦ సేయను మతాంతర మంత్ర పాఠముం
జేయను దేవతాంతరము ♦ సేయను దేశికు నిగ్రహంబునే
జేయు ననన్య సాధన వి ♦ శేషమ దెట్లగొ తెల్పు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౪

ఉ॥ చేయఁగ బుణ్యకర్మలకు ♦ జింతిలి నందఁగుగాని యాత్మస
ర్వాయువు నంత మొందదగు ♦ నట్టి యఘంబుల జింత సేయ మే
లాయె నటంచు మరే పరులు ♦ నాత్మ దలంచిన కిన్క భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౫

ఉ॥ రోయఁడు గంగ లేదు మది ♦ రోసము గాదు పసందుగా మునీ
రోయుట వాదు బత్తులను ♦ రూఢిగ బ్రోచుట సాదు చాలునే
వ్రాయుట నీదు కీర్తనల ♦ వారిగ నూదుముదంబు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౬

ఉ॥ కూయివినంగరాదొ విన ♦ గోరిక లేదొ మమాత్మ రక్షణం
బాయుటచేదొ ముక్తజన ♦ పాలనగాదొ పరుండబోదొ దీ
ర్ఘాయువు నీయరాదొ నిను ♦ గాంచిన పాపముబోదొ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౭

ఉ॥ కోయలు మందులమ్ముతరి ♦ గూయుదె రెన్నియొ మందులందు వె
జ్జేయెడ నట్టి మందులను ♦ జెన్నని కొన్నను నష్టమౌను సు
మ్మీయది మామకాను భవ ♦ మేయగు జెప్పితి దేవ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౮౮

ఉ॥ చాయమగండు రాహువుర ♦ సాసుతు డింద్రగురుండు కేతువు
ర్చాయకొమారుడిందు భృగు ♦ సౌమ్యగ్రహంబుల చార మాపద
ల్జేయునటందు రందులకు ♦ జింతిల నేగతి నీవె భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా॥ ౮౯

ఉ॥ సాయముగమ్ము లెమ్ము ధర ♦ సంస్మృతిసమ్ము మృగమ్ముసమ్ము నే
జేయుదు జోతవమ్ము గడ ♦ సేయుదు పొమ్ము రుదావకీనసం
ధాయము దమ్ముసిమ్ము పర ♦ ధామము జేర్చు రమ్ము భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా॥ ౮౦

ఉ॥ వ్రాయుదుగాని నోటనన ♦ రాదల వ్రాసినదెల్ల నేను గ్రా
సేయుదుగాని నీకనియు ♦ జీర్ణముగా నొగి పంచపాల స
న్యాయము సేయగాదు కవి ♦ తార్థము నొప్పగనుంచు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౮౧

ఉ॥ చాయనిసుంగు శాణయుగ ♦ జన్మనవాష్టదశార్ధసప్తమా
మ్నాయగణేయరాసుల శరీ ♦ మంపడ జేయజాలున్న నన్ను నా
చాయను గట్టపెట్టకు మ ♦ సాధ్యము గాదిది నీకు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౮౨

ఉ॥ వ్రాయుదుగాని పద్దెముల ♦ వారిగ ముందుగ వ్రాయు పద్దెమా
పేయకుదొల్తచూలి మురి ♦ పెంబిరుచూలికి నుంచకుండు న
ట్లాయెను నాదుబుద్ది సని ♦ నారయ నెందున్బ్రోవు భావనా
రాయణ భక్తపోషణ మ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౯౩

ఉ॥ తాయినిదండ్రినిన్మదిమి ♦ దాల్చినచో గోమరుండు రక్షక
స్థాయిగదోయి దంపతుల ♦ దల్ప బరస్పర ప్రేమ నాయకీ
నాయకులోయి రక్షకము ♦ నాకును నీవుగదోయి భావనా
రాయణ భక్తపోణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౯౪

ఉ॥ పాయసముర్రైలప్పములు ♦ బప్పలగారెలు జారునట్లు మే
లోయిరమూరుబిండ్లు బులు ♦ సొప్పగ గూర్చిన కాయగూరలుం
బాయకనారగించు మిదె ♦ పల్కరు నేతినినించ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౯౫

ఉ॥ మోయుదు వెల్లవో భువి న ♦ మోఘముగాగ మహాహిఘోణిప
ర్యాయపరాకృతిం బ్రజల ♦ సందరి సర్వవిధంబులందమిం
బాయక నేలుదీవచట ♦ ప్రాభవవృద్ధి గణించి భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౯౬

ఉ॥ నాయనవంటినిన్ను మరి ♦ నారదసన్నుతుడంటి నొంటినా
రాయణుడంటి నెమ్మది న ♦ హర్నిశలందున గావుమంటి దీ
ర్ఘాయువు నీయనుంటి పర ♦ మాత్ముడటంటిని నేను భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౯౭

ఉ॥ చేయలతింజలంబడగి ♦ చేసిన పూజలనొందుదీవు వా
లాయముమేయిదాల్పు లెస ♦ లారశరణ్య మెఱుంగలావును
వ్వాయిబలే శబాసుతగు ♦ వార్తల నెన్నెదబ్రోవుభావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౯౮

ఉ॥ జాయకునంబఁగొందు నర ♦ సమ్మను నామము నచ్యుతాఖ్యుఁడౌ
నాయన రామసోదరుఁడ ♦ నామము నాదు గొమారుఁడౌంచు లే
బాయపువాఁడు పేరు వర ♦ దార్యుఁడు నింపరి శ్రీవుభావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౯౯

ఉ॥ శ్రీయతిరాజ శేఖరు వి ♦ శేష దయాకరు భోగివీరు కా
షాయసువస్త్రధారు గురు ♦ సారుసశిష్యకుమారు ద్రావిడా
మ్నాయ వరార్థ బోధకరు ♦ నైచ్యపరుండగ నేలు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౦౦

ఉ॥ జేయుఁడు లేడిలందలచ ♦ జిత్తమునం దజుఁడచ్యుతుండు నా
మ్నాయనుతుండ ఖండలుఁడ ♦ నాద్యుఁడ సంతుఁడమానుషాత్మ స
ర్వాయుఁడ మాయకుండఖిల ♦ రాజ్య రమావరుఁడీవ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౦౧

ఉ॥ కోయిలనుబ్బు తాళ్ళనిడు ♦ కోరిక నాకుఫలించ లేదు వా
తాయనచిత్రితావసథ ♦ మైనను గట్టగ చేతగాదు నా
రాయణ నామసంస్మరణ ♦ మైతగునాకయి నూదు భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మ విలక్షణ రక్షణేక్షణా ౧౦౨

ఉ॥ పాయురుపస్థపాదములు ♦ వాక్కరంబులు గర్మజాలముం
జేయునునాస్యశ్రోత్రములు ♦ జిహ్వయునక్షులు జర్మమెన్ననీ
కాయమునందు జ్ఞానవిధి ♦ గాలెడి చిత్తముతోడ భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౦౩

ఉ॥ తీయని మాటలందనిసి ♦ తీరుగ జేడెలగూడి పూరుషు
ల్బాయని మోహమొందిమెడ ♦ బాయరిదేమది నిత్యమంచు నా
రాయణ చింతలేశమొగి ♦ నారయ రజ్ఞతజేసి భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౦౪

ఉ॥ తోయజనాభ పద్మపద ♦ ధూర్జటిసన్నుత పంకజాసనా
మ్నాయ వర ప్రదానసుర ♦ నాధనుతాఘ వినాశ దేవకీ
తోయజగంధి పుత్రహరి ♦ ధూర్తజనాంతక శౌరి భావనా
రాయణభక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౦౫

ఉ రోయినిరీక్ష్య నష్టమిని ♦ రూఢిగ దేవకిదేవి గర్భస
త్తోయధి పూర్ణచంద్రుడన ♦ దోర్బలమొప్పగబుట్టి పాపదై
తేయులజంపి కర్జముల ♦ ధీరతనింపితికాదె భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౦౬

ఉ॥ శ్రీయతిరాజ శిష్యచయ ♦ శ్రేష్ఠగురుండగు నాంధ్రపూర్ణుడే
తాయిగనొప్ప దేశికుడు ♦ దధ్యమనాఖ్య వసుంధరన్మహా
ధ్యాయుడు రామసోదరుడు ♦ దప్పక ప్రోవుము భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షణేక్షణా ౧౦౭

ఉ॥ ఈయదె నీకు నే శతక ♦ మిచ్చితి వేగొను మున్న క్రోధనా
హాయన పుష్యమాసమున ♦ నారయ సబాణ శరంబు జూడగా
నీయెడ బంచయుక్తనవ ♦ మీనుసమంబగునన్న భావనా
రాయణ భక్తపోషణ మ ♦ దాత్మవిలక్షణ రక్షకోత్తమా ౧౦౮

శ్రీ భావనారాయణ శతకము సంపూర్ణము.

శ్రీమదచ్యుతశఠగోపయతిరాజ వరవర నిజగురుభ్యోనమః

